# కొత్తలోకము

నవయుగ కవిచక్రవర్తి

జి. జాషువ

ప్రచురణ:

హేమలతా లవణం
పటమట - విజయవాడ

# కవి సంతతి నివేదన

అక్కలు అన్నలె కాదిట
చక్కని నాకన్న కావ్య సరసిజ నేత్రల్
పెక్కండ్రు తోడ నడచెడ
రక్కా చెల్లెండ్రై శుభము లందుము తనయా !

అంటూ మా వివాహ వేదికపై నాన్నగారు నన్ను ఆశీర్వదించినప్పుడు ఆయన కావ్య కన్యకలను పునరలంకార భూషితులుగాచేసి మీ ముందు నిల్పే బాధ్యత నామీద పడుతుందని నేను ఏమాత్రమూ ఊహించ లేక పోయాను.

"............యెటుల్ మొలంగెదో బలితపు టుగ్ర నిష్ఠలల వాటొనరించు అనుంగు భర్తతో" అని హితవు చెప్పారేగాని ధనాఢ్యుణ్ణి నాకు చూడలేదు అయితే స్నేహితులకు, కార్యదక్షతకు పేదలు కారు గదా. అంతేకాక తెలుగు దేశమంతా నాన్నగారి అభిమానులు వ్యాపించి ఉన్నారు. జాషువ సాహిత్యాభిమానుల అండదండలు మాకు తరగని నిక్షేపం. ఈ బలము చూసుకునే మొత్తం జాషువ సాహిత్యాన్ని పునర్ముద్రించి మూడు, నాలుగు సంవత్సరాలలో అందించాలని పూను కున్నాము.

ఒక వందరూపాయలు ముందుగా యిచ్చి ఈ సాహిత్య ప్రచురణకు పోషకులుగా చేరిన వారికి మొత్తం జాషువ సాహిత్యం అంతా ప్రచురణ కాగానే ఎప్పటికప్పుడు పంపగలము. ముందుగా దేనికది విడివిడిగా

అన్ని కృతులు ప్రచురించి, తర్వాత సంపుటాలుగా కూడ ప్రచురించాలనే యోజన ఉన్నది.

నాన్నగారి 80వ జయంతినాడు ఈ నవ పునర్ముద్రిత సాహిత్యంలో ప్రథమ కుసుమంగా "కొత్తలోకము" వికసించడం ఆనందదాయకం.

"కొత్తలోకము" రచన 1952లో ప్రారంభించారు కాని మధ్యలో ఎప్పటికప్పుడు యేవో అవాంతరాలు వచ్చి త్వరగా పూర్తి కాలేదు. 'తొలికోర్కె' అంతమైన ఘట్టం చేరేసరికి మా కుటుంబంలో అత్యంత విషాదకరమైన సంఘటన జరిగింది. అదే మా తల్లిగారు అకస్మాత్తుగా, నాన్నగారు భీమవరం సన్మాన సభకు వెళ్ళిన రోజున, కన్నుమూయడం. అది వర్షాకాలపు కాళ రాత్రి. నా వొడిలోనే ఆమె తలవాల్చింది.

మా అమ్మ మరణంతో "కొత్తలోకము" సృష్టి "తొలికోర్కె"తో ఆగిపోయింది. ఆమె అటు కాటిదిక్కుకు పయనించిన మరుక్షణాన్నే సర్వావయవ సంధి బంధనములన్నియు వీడెననీ, తన కళా ప్రవంతి యంతయూ ఆమె వెనుకనే శ్మశాన ధరణిలో నిదురించినదనీ నాన్నగారు భావించి, ఇంచుక అధైర్యపడినా; సజీవంగా యున్నప్పుడు పతియొక్క స్వాభిమాన కాంక్షను నిరంతరం, నిరాటంకంగా పెంచి పోషించిన "మెరాయి" చైతన్య స్మృతి నాన్నగారి కవితా ప్రవంతిని ముందుకురికించిందేగాని, ఇంకిపోనీయలేదు. అంతేకాదు జీవనతత్త్వము యెడల ఆయనకుగల విశ్వాసాలలోనూ వెనుకకు మరలనీయలేదు. "మలికోర్కె" వెలువడింది.

ఈ కృతిని తన అర్ధాంగి స్మృతికి అంకిత మిచ్చి నాన్నగారు ఋణ విముక్తులు కాదలిచారు. నేడు నాన్నగారి సాహిత్య నవ పునర్ము

ద్రణను దీనితో ప్రారంభించడం ద్వారా మాతృశ్రీకి నా ప్రేమ పూర్వక శ్రద్ధాంజలి ఘటిస్తున్నాను.

నాన్నగారు ఎప్పుడూ తన కృతుల ముద్రణ విషయంలో తగినంత శ్రద్ధ తీసుకునేవారు కారు. ప్రచురణ కర్తల సాహిత్యాభిరుచి, ప్రూపు రీడర్ల శ్రద్ధ, పాండిత్యముల దయా దాక్షిణ్యములపై సాహితీ కన్యకల 'మానము' ఆధారపడి యుండేది.

ఇప్పుడు, వీలైనంతవరకూ ముద్రా రాక్షసుల బారినుండి రక్షించి సర్వాంగ సుందరముగా తయారు చేయాలని పూనుకున్నాము.

నాన్నగారు తన కావ్యాలను నాకు ఇవ్వడం నేను ఆస్తిగా భావించుట లేదు; కవితాభిమానుల రసపిపాసను తీర్చ నన్ను ప్రతినిధిగా నియమించారనీ, కవనంద్వారా తాను ప్రారంభించిన సాంఘిక విప్లవ సందేశం దెసదెసలా వ్యాపింప జేయుటకు నన్ను సాధనంగా ఎన్నుకున్నారనీ భావిస్తున్నాను. అందుకే ఈ పనికి పూనుకుంటూ మీ అందరి సహకారాన్ని ఆహ్వానిస్తున్నాను. ఈ మూడవ ముద్రణ అందిస్తున్నాను.

పటమట,
విజయవాడ,
1-12-82.

హేమలతా లవణం

# ఒక మాట

జననం బందినదాది నాకనిన ఈ సర్వంసహా నాటకం
బున నానావిధ పాత్రధారులయి రేపుల్మాపు లాటాడి పో
యిన పోనున్న నటీ నటోత్తముల అయా ఘట్టముల్ నీవెరుం
గని దేముండు జగత్ప్రభూ ! అయిన నాకర్ణింపు మూకొట్టుచున్.

ఈ మహా నాటకాన్ని ఆరువదేళ్ళు చూచాను. అంక పరిమితిలేక యుగయుగాలు నటన సాగుతూనే యున్నది. ప్రత్యక్షరం, ప్రతిపదం రసభరితం, భావస్ఫోరకం. అన్ని ఘట్టాల్లో హృదయ ద్రావకాలైన దృశ్యాలున్నాయి. ప్రధాన నాయకుడు పంచజనుడు. కవి హృదయాన్ని గమనించని కఱకు పాత్రధారులు పందలు వేలు. సత్యం దెబ్బతిని, దర్మం దసిలి నాటకం రసాభాసమయింది రంగస్థలంలో కల్లోలం, రభస చెలరేగింది. పాపం మహా నాటక కర్త నిందాబద్ధుడై వ్యాఖ్యానాలకు గురైనాడు పునర్ముద్రణంలో కొన్ని సవరణలు సృష్టికర్తకు మనవిచేసు కోవలెననిపించింది. మహాస్రష్టకెదురై హృదయావేదన నివేదించు కునే పాటి గుండె నిబ్బరం లేకపోయింది.

సృష్టికర్తవు నీవు నీ సృష్టిలోని
మానవుడ నేను—ఇద్దరిమధ్య మనకు
ముసుగులో గ్రుద్దులాటలు పొసగవింక
హక్కు గలదయ్య ప్రశ్న సేయంగ నిన్ను.

అన్న ఒక సూక్తి జ్ఞప్తికి వచ్చింది. గుండె దిటవుపడ్డది. ఆ తెర చాటు నాటక కర్త నర్థించే వాంఛితాలే ఈ "కొత్తలోకం". ఈ కృతి పరలోకగత అర్ధాంగి, మధుర హృదయ మరియా మానిని కంకితంచేసి ఋణవిముక్తుణ్ణి కాదలిచాను.

—జాషువ.

# ఋణ విముక్తి

నేను కవీశ్వరుండనని నీవొక బానిస వన్ననాడు గ
ర్వాన శరీరమున్ మరచి-స్వర్గనివాసము వీడివచ్చి నా
మేను సగంబు పంచుకొని మేటి యశస్సు గడించు దివ్యవా
గ్ధేనువ వీవటంచు గుఱుతింపగ లేనయితిన్ సతీమణీ !

నీవటు కాటిదిక్కు పయనించిన నాటి మరుక్షణాన స
ర్వావయవ సంధిబంధనములన్నియు వీడె, కవిత్వభారతీ
దేవత మూగవోయె, సుదతీమణీ నాదు కళాస్రవంతియున్
నీవెనుకఁ శ్మశానధరణిఁ నిదురించినదో! సతీమణీ !

నా తను యష్టి, ప్రత్యణువునఁ గల పుష్టికి కారణంబు నీ
చేతి సుధాశనంబికద ! చిక్కెనె నాకనరాదుగాని, నా
మాతకు మారుగా, యనుగుమానిని రూపముదాల్చినట్టి నా
జాతక పుణ్యరేఖవొ ! ప్రశస్త శుభైకవరప్రదాత్రివో !

—ప్రియభర్త

# ఆవేదన

నను గన్నమ్మకు భారతాంబ కెప్పుడైనన్ బశ్చిమస్వర్ణ జీ
వన సౌభాగ్యము జిక్కనాయని మనోజ్ఞం బారటం బంద వె
చ్చని కన్నీటి ఝరంబులం బడకమున్గన్బిట్టు శోకించి పో
యిన మాసాదు నరేంద్రబాబు పురమాయించున్ జగత్సం స్కృతికిన్.

ఒక నూల్పోగున సీమభూధరగజవ్యూహంబు బంధించి యిం
చుక రక్తచ్యుతిలేని రాచటికమున్ జూపించి ఖండాంతర
ప్రకటఖ్యాతి గడించినట్టి మునిమూర్ధన్యుండు బాపూజి దా
చక మాకిచ్చిన విశ్వసంస్కృతి ప్రపంచంబెల్ల శోభిల్లుతన్.

ఘన భూదాన మహాధ్వరంబున జగత్కల్యాణ మాశించి, క
ల్గినవారిం గరగించి పేదలకు భుక్తిం గూర్చు సాబర్మతీ
వనవాసిన్ మునిచక్రవరి ని వినోబాభావె సీక్షించి వా
కొను మే సంస్కృతి నభ్యసించెదవొ నిక్కల్మాని స్వార్థప్రభూ!

సమశీతోష్ణ సుఖాభిరామము నహింసాధర్మ సిద్ధాంత వం
తము, నానావిధ రత్నరంజిత సముద్రప్రావృతం బస్మదీ
య మహాభారత ఖండరాజము, కులవ్యాళోగ్రపూత్కారధూ
మము నామూలముగానణంచి సుఖసంపత్తిన్ సమార్జింపుమా.



సతి మరియాతో జాషువ

# కొత్త లోకము

## వ్యత్యాసము

సౌధరాజమందు జన్మించె నొక బిడ్డ
పూరిగుడిసెలోన బుట్టె నొకడు
ప్రబలి రందు నిందు; రాజయ్యె నొకడు
నొకడు రానురాను సుకవియయ్యె.

అతని రాజదండ మధికార ధన మయం
బితని కలము కావ్య శతశతమ్ము;
అతని యిల్లు మేటి రతనాలరుచిమయం
బితని యిల్లు గండ వితతిమయము.

కవి నెఱుగు రాజు, రాజును
గవి యెఱుగును, గవిని రాజు గణియింపం డా
కవి రాజు గణన సేయడు,
కవియును రాటిద్ద రాత్మగౌరవ కాముల్.

భయముతోడ రాజు ప్రస్తుతింతురు ప్రజల్
భక్తితోడ కవిని ప్రస్తుతింత్రు
జీతమిచ్చి రాజు సేవింపబడుచుండు
జీతమీక సుకవి సేవలందు.

రాజు చేతి కత్తి రక్తంబు వర్షించు
సుకవి చేతి కలము సుధలు గురియు
అతడేలగలుగు యావత్ప్రపంచంబు
నీతడేలగలుగు నిహము పరము.

రాజు మరణించె నొక తార రాలిపోయె
కవియు మరణించె నొక తార గగనమెక్కె
రాజు జీవించె జాతి విగ్రహములందు
సుకవి జీవించె ప్రజల నాలుకలయందు.

సమసెన్నేటికి తెల్గుజాతికి సమస్తక్లేశముల్, సింహ పీ
ఠము నిక్కెన్ నయిజాముసీమల, ప్రతిష్ఠాభేరి ఝాంకారనా
దము లుప్పొంగ సువర్ణదండమును హస్తంబందు గీలించె లో
పము లేదేమిట నైకమత్యమును సంపాదించి పాలించినన్.

నాగార్జునుని దయా నయన ద్వయమునందు
జన్మించె సౌభాగ్య సాగరంబు
బ్రహ్మనాయని చిత్త పద్మంబు వికసింప
నుదయించె హరిజనాభ్యుదయ మహము
వర్ష పంచక రత్న పథక కల్పకమందు
చిగురించె నగర సంక్షేమ శాఖ
ఆంధ్రప్రదేశంబు నాశ్లేష మొనరింప
నేతెంచె రసవాణి కృష్ణవేణి

అక్షరాక్షర మధుర సస్యందు లగుచు
కూయుచున్నవి సుకవితా కోకిలములు
తెలుగుగడ్డ ప్రజాభీష్టములు ఘటించి
ప్రబలుగావుత మయత సంవత్సరములు.

నేను స్వతంత్రజీవినయి నిల్చితి నేడు స్వరాజ్య రాష్ట్రి యు
ద్ధాన విజేతనై యభిమతంబులు తీరినవాడనై తెలం
గాణమునందు శాశ్వతముగా మణిపీఠము నెక్కఁబోవుచు
న్నాను జగత్ప్రభూ! వినుము నా యధికార కథాప్రణాళికల్.

ఆడిన మాట తప్పను, మహాత్ముని చెప్పులజాడలోన కా
లాడ చరించెదన్, ప్రజల కన్నము బెట్టెద, వర్ణభేదపుం
జీడ నణంచెదన్, గటికచీకటి వాపెద, వెట్టి నమ్మకా
లూడని బాడ హస్తమున నూనెద శాత కళాకుఠారమున్.

నా కవచం బహింస, సహనంబు మహాయుధ, మెక్కిరింత ధ
ర్మైకనిరూఢి, సత్యము నియంత, యనంతజగత్తు మొత్తమై
నాకెదురైన గెల్తును, వినాశపుబాంబుల గుండెకాయలో
బాకును, లోకమోహన సబర్మతి సన్మునికిం గుమారుడన్.

నాగార్జునాచార్య సాగరం బేచేట
రత్నాలు పండించు రైతు నాకు
చలిచీమ మృతికి కన్నీలు చెమ్మగిలు శాక్య
ధరణి నాయక మౌళి గురువు నాకు

తెలుగు తెలంగాణములకు పొత్తునగూర్చు
హైదరాబాదు రాజ్యంబు నాకు
కోలారు గనులు వజ్రాలు పండు పొలాలు
సాటికెక్కిన బొక్కసాలు నాకు

అవల గోలుకొండ యివల శ్రీశైలంబు
క్రీడ సల్పు రత్నగిరులు నాకు
వెఱపు గిరపు లేని వీరవిక్రమశాలి
బాలచంద్రుడు సాటివాడ నేను.

ఊరూరన్ శరదిందుచంద్రికలు విద్యుద్వాహినుల్ పారగా
ఖారీయెత్తు పరిశ్రమల్ నడచి ద్రవ్యక్షేమమున్ దీర్ప, ము
క్కారుంబంటల దెల్గురాణి మెయిసింగారింప, గర్వంబుగా
నూరేగింతు నశోకముద్రికల నాంధ్రోర్వీ ప్రపంచ ప్రభల్.

పలికింతున్ గవికోటిచే హృదయపుష్పంబుల్ వికాసించి యా
హాలకుం దావులొసంగి, పుక్కిటి కథావ్యాధి న్నివారించు ధీ
బలమున్ గూర్చు కృతుల్ ప్రలోభ కవిదూర్వాసుల్ దగా నమ్మకం
బుల రొంపిం దలబుంపరింక పడిపోవున్ జల్దిపాండిత్యముల్.

కొట్టిన గొట్టరాదనెడు గొప్ప నినాద మనంత విశ్వ స
మ్రాట్టగు నేసునాధు రుధిరంబున కల్వరికొండ కొమ్ములన్
బిట్టుగ మ్రోగుచున్నది తపించుచు సర్వ దిగంతరాళముల్
కట్టువడున్ తదీయ ఘన కారుణికత్వ పటుత్వ శక్తికిన్.

కృతముల్ పల్కులు రామలక్ష్మణుల భ్రాతృత్వంబుపోలెన్ జగ
ద్ధితమున్ గూర్పని శుష్కపండితులు భక్తిశ్రద్ధలున్, శౌచముల్
బ్రతుకీడ్వన్ దృఢసాధనంబులగుచున్ రాణించునేకాని సం
స్కృతికిం జిన్నెలు కా వితరు లేరీతిన్ సమర్థించినన్.

పదవి జిక్కెనంచు ప్రజలకు దూరమై
సన్నుతులకు చేయి సాచలేను
చదువుకొంటినంచు సాటిమానవుని ప్రే
మించకుండ నీసడించలేను.

పలుకవేనాడు మా పత్రికల్ వార్గిక
వ్యామోహమున నసత్యప్రశంస
కాలూన జాల దేకాలాన మా వినూ
తన రాజ్యమున నవిద్యా పిశాచి
తలసూపదింక నాంధ్రప్రదేశమున దు
ర్భిక్ష వధూటీ కటాక్షలనము
ప్రవహింపకుండ దుజ్జ్వల సాహితీ గంగ
గ్రామీణ జనకుటీరములమీద

బోధిసత్వమూర్తి భూగర్భమున మాకు
దాచి చన్న ప్రేమతత్వ నిధుల
నడుగువారి కడిగినంతగా నర్పింప
గలము, మాది కలికి తెలుగుకులము.

క్రమతన్ విచ్చిన వేయి రేకుల దళత్కంజాత మాంధ్రప్రదే
శమునం దిప్పటి పల్లెనాటి ప్రజలైశ్వర్యంబు నీక్షించి ఘం
టము చేపట్టుము, నైషధ ప్రముఖ నానాకావ్యనిర్మాతృ చం
ద్రమః శ్రీనాథ మహాకవీ! దొరుకవన్నా నీకు జొన్నన్నముల్.

కలనాదంబు నందికొండ శిఖరాగ్రంబెక్కి, కృష్ణాపగా
జల ముప్పొంగి తెలుంగుభూముల కభీష్టంబుల్ ప్రసాదించెడిన్
పలుకుల్ నేర్చితినంచు దిట్టతివి మాపల్నాటి గడ్డన్ భళా
భళి! నీ నవ్వినె నాపచేనిపుడు జొన్నాపంటలుం బండెడిన్.

నాగార్జున సాగరమున
కేగుము శ్రీనాథసత్కవీశ్వర! యట ది
వ్యాగారాంతరమందు త
థాగతుడగు బుద్ధనృపతి దర్శనమిచ్చున్.

బాలు కృతార్థములయ్యెత
దాలయ కుడ్యంబు లగుచు నాతని రూప
శ్రీలం దాలిచి పరిసర
కేళీకలనాభిరామ కృష్ణాపగయున్.

నీరసమైన యగ్గిరి వనీవన భూములనుండి దివ్య
శంఖారవమొండు, స్తూపశిఖరాగ్రముల న్నినదించుచుండు, సం
సార దవాగ్ని తప్తులకు శాంతి ఘటించుచు నిద్రబోవుచు
న్నా రనరాదు, భిక్షువులు నాడును నేడు జగత్ప్రబోధకుల్.

పులులు ప్రదక్షిణించినవి ముద్దిడుకొన్నవి నందికొండలో
యల చరణాంకముద్రికల స్వాగతగీతములాలపించి ప
క్షులు తమిమీర రెక్కగొడుగుల్ ఘటియించినవిందు బుద్ధ శి
ష్యులకు, పవిత్రచైత్యపరిశోభితముల్ పలనాటి క్షేత్రముల్.

మణిభూషల్ మణిసౌధముల్ సకలసామ్రాజ్యంబు బోనాడి దా
రుణ సన్యాసము స్వీకరించిన నరేంద్రుం డీ నగంబందు ప్ర
త్యణు మధ్యంబున గోచరించెడిని, బ్రహ్మాండం బహింసా పరా
యణమై పాదములాశ్రయించె నది పుణ్యక్షేత్రమాంధ్రాళికిన్.

అది చల్లారని జ్యోతి ప్రోజ్జ్వలిత మాయా మానినీగర్భ సం
పద, సిద్ధార్థ మహావతారమిట నావాసనబుగావించు కొ
న్నది పెక్కేడులనాటి నిద్రిత మహా నాగార్జునాచార్య న
భ్యుదయశ్రీ వెలిగక్కుచున్, నవయుగంబున్ ధన్యముంజేయుచున్.

కాలకఠోరభూరి పరిఘాహతిగూలిన నాటి బౌద్ధ వి
ద్యాలయ భగ్న శేషములయందు ననంత శతాబ్ద గర్భ ని
ద్రాలస సంస్కృతిరమ తథాగతు పుణ్యకథానకంబులన్
జాలిగ బాడుచున్నది దిశల్ పులకింప విపంచి మీటుచున్.



# తాలికోర్కె

కనపడవేమిరా జగము కల్పనచేసిన గారడీడ నీ
యునికియు రూపమున్ దెలియ కున్నది లేనిది నిర్ధరింపలే
కనుపమ సంశయగ్రసితమైనది విశ్వము, సాగవింక ద
ర్శన మిడకున్న నీ తరతరంబుల దాగుడుమూత వేషముల్.

ఎవరడిగినారు నిన్ని
అవక తవక సృష్టిసేయమని? చేసితివో
దివి దాగుకొన్న లోక
వ్యవహారంబెట్లు సాగురా? బిసకాడా!

సకల కష్టములను జగతిమీదికి నెట్టి
శాంత సౌఖ్యములను చంక బెట్టి
అందుబాటుగాని ఆకసంబున జేరి
కులుకుచుంటివా? నిగూఢ చరిత!

యుగము లెన్ని గడచెనో! యెంద రెందరు
భూపతులు పుట్టి పోయినారొ!
నీకు చావురాదు, మాకు సౌఖ్యములేదు
అలుక వలదు నిజము పలుకుచుంటి.

నీ యేజంటులు కొందరేరుపడి, సందేహించుమాలో భయ
చ్ఛాయల్ కల్పనచేసి నేర్పిరి తమాషాభక్తి తాత్పర్యముల్
వేయిన్నారు మతాలు వర్ణములు మొల్చెన్ బొల్చె వైషమ్యముల్
భాయీ! హాయిగదల్చి యీబెడద మాన్పన్ డిగ్గిరమ్మర్వికిన్.

ఏనాడో పసుచుందనంబున ధరన్ సృష్టించి మిన్నెక్కి ని
త్యానందంబున నీతగొట్టుకొను వృద్ధ వ్యక్తి వీనాటి మా
యా నాట్య ప్రళయప్రపంచగమనం బర్థంబుగాదైన నీ
మౌనంబున్ విడనాడి రమ్ము పరికింపన్ నేను వర్ణించెదన్

నాకున్ భక్తులసంఖ్యసంఖ్యలుగ నున్నారన్న గర్వంబుతో
నాకంబున్ విడనాడి భూతలము సందర్శింపగా వత్తువా
యీకల్ తోకలు దుల్చి పంపెదరు నిన్నీనాటి నానామతో
ద్రేకుల్, వాకొననేల పెట్టరొకరున్ దీర్ఘప్రసాదంబులన్.

నాలుగు మోములున్ దలలు నాలుగు దాలిచి వత్తువేమొ! యీ
కాలమువారు, మానిసిమొగంబిది, పద్మము కన్నదంచు జం
త్వాలయమందు జేర్తురుసుమా! కమలాసన, స్రష్టనంచు నీ
నాలుగు నోళ్ళ మొత్తుకొనినన్ వినరొక్కరు, విశ్వసించరున్.

ధరణిపై భక్తులెల్లరు రవాణాచేయు
నైవేద్యముల నప్పనముగ దినుచు
అందిచావులజిక్కు సమృతంబు భక్షించి
పెక్కెండ్లచావు తప్పించుకొనుచు

కనుసన్న మెలగు చక్కని దేవగాయనీ
సుందరాంగుల కౌల్వలందుకొనుచు
ముడుపులుగట్టి పంపెడు కానుకలనెల్ల
నట్టింటిలో దాచిపెట్టుకొనుచు

చీకు చింత లేక జీవించు నీమీద
భక్తి బదులసూయ ప్రబలమయ్యె
పొగడజాల నాకు మొగమాటములు లేవు
స్రష్టకింత రాజసంబు తగదు.

పొగడుటలు దక్క నావలె
దెగడుటల నెఱుంగవీవు- నేటివరకు, నీ
పగతుడనుగాను, నీలో
సగమంశగలట్టి కావ్యజగతీ స్రష్టన్.

మతపిచ్చిగాని వర్ణో
న్నతిగానీ స్వార్థ చింతనముగానీ నా
కృతులం దుండదు, శబ్దా
కృతి బ్రహ్మానందలక్ష్మి నృత్యమొనర్చున్.

సృష్టిలో నీవు దాచిన రహస్యములెల్ల
ప్రత్యక్షముగ బట్టబయలు చేసి
చక్షురింద్రియములు సాధింపలేని నీ
యాకారమును పల్కులందిమిడ్చి

వాయు మండలమున బల్కించు నీ మూక
 దొంగవీణెలకు తంత్రులు బిగించి
ఎవరెఱుంగనిచోట బవళించి నిద్రించి
 గుఱుపెట్టు నీగుట్టు నెఱుకపఱచి

కలుషభోజనమగు ధరావలయమందు
విసిగి వేసారు నరుని మానసమునందు
అమృతముం జిల్కు చింతల నపనయించు
హృదయముగలట్టి నవ రచయితను నేను.

కలవోయి ప్రతి పుష్ప గంధ గర్భములందు
 నీ దయామకరంద నిర్ఝరములు
కలవోయి ఘనఘనాఘన నిక్వణములందు
 ననలెత్తు నీదు కంఠస్వరాలు
కలవోయి గగన నక్షత్ర నేత్రములందు
 పొంటమరించెడు సానుభూతి నదులు
కలవోయి సాంధ్యరాగ ప్రభాంబుధులందు
 నీరూపగత నైగనిగ్య కళలు

ఉరుములందున మెరసెడు మెరములందు
దాగికొనియున్న నీ యదంతరపు రూపు
కలవరము పెట్టుచున్నది క్ష్మాతలమును
ఎందు కీ గోల ? కన్పింపు మందగాడ !

కనుసన్న మెలగు చక్కని దేవగాయనీ
సుందరాంగుల కొల్వులందుకొనుచు
ముడుపులుగట్టి పంపెడు కానుకలనెల్ల
నట్టింటిలో దాచిపెట్టుకొనుచు

చీకు చింత లేక జీవించు నీమీద
భక్తి బదులసూయ ప్రబలమయ్యె
పొగడజాల నాకు మొగమాటములు లేవు
స్రష్ట కింత రాజసంబు తగదు.

పొగడుటలుదక్క నాపలె
దెగడుటల నెఱుంగవీవు- నేటివరకు, నీ
పగతుడనుగాను, నీలో
సగమంశగలట్టి కావ్యజగతీ స్రష్టన్.

మతపిచ్చిగాని వర్ణో
న్నతిగానీ స్వార్థ చింతనముగానీ నా
కృతులం దుండదు, శబ్దా
కృతి బ్రహ్మానందలక్ష్మి నృత్యమొనర్చున్.

సృష్టిలో నీవు దాచిన రహస్యములెల్ల
ప్రత్యక్షముగ బట్టబయలు చేసి
చక్షురింద్రియములు సాధింపలేని నీ
యాకారమును పల్కులందిమిడ్చి

వాయు మండలమున బల్కించు నీ మూక
  దొంగవీణెలకు తంత్రులు బిగించి
ఎవరెఱుంగనిచోట బవళించి నిద్రించి
  గుఱుపెట్టు నీగుట్టు నెఱుకపఱచి

కలుషభోజనమగు ధరావలయమందు
విసిగి వేసారు నరుని మానసమునందు
అమృతముం జిల్కు చింతల నపనయించు
హృదయముగలట్టి నవ రచయితను నేను.

కలవోయి ప్రతి పుష్ప గంధ గర్భములందు
  నీ దయామకరంద నిర్ఝరములు
కలవోయి ఘనఘనాఘన నిక్వణములందు
  ననలెత్తు నీదు కంఠస్వరాలు
కలవోయి గగన నక్షత్ర నేత్రములందు
  పొటమరించెడు సానుభూతి నదులు
కలవోయి సాంధ్యరాగ ప్రభాంబుధులందు
  నీరూపగత నైగనిగ్య కళలు

ఉరుములందున మెరసెడు మెరములందు
దాగికొనియున్న నీ యదంతరపు రూపు
కలవరము పెట్టుచున్నది క్ష్మాతలమును
ఎందు కీ గోల ? కన్పింపు మందగాడ !

రోజులు మారిపోయినవి, రోజుకురోజుకు దేవపూజపై
మోజులు సన్నగిల్లినవి, మోక్షము కద్దను నమ్మకాలపై
బూజు పరంజుకొన్నది, ప్రభుత్వము సాగదు, కంచుకోట ద
ర్వాజలు దాటిరమ్మ బహిరంగముగా రతనాల తేరుపై.

జపమో ధ్యానమొ చేసికోదగు మనుష్యప్రాణివై యుండి వి
శ్వపతి నన్నవిధేయతన్ బలుకరింపన్ గుండెలెట్లబ్బె నీ
యపరాధంబు సహింపరాదనుచు శాపాగ్నిం బ్రయోగించి నా
కపకారంబు దలంతువో తగని కార్యంబద్ది నీ శక్తికిన్.

నీ విచ్చినదే యనుకో
నా విద్యారేఖ, దాని నాశనమునకున్
నీవే కారణ మగుచో
నీవెంతో నేను నంతియేకద ప్రకృతికిన్.

నీమీద నీగవాలిన
భూమీవలయంబు క్రుంగిపోయినగతి నెం
తో మధన పడెడు భక్తుల
కీ మాటలలోని లోతు లెట్లర్థమగున్.

నీ చరిత్రలోని నిగ్గు జగ్గులు దేల్చి
సర్దినారు కొన్ని సందియములు
తత్త్వవిదులు, వీరి తరహా పరీక్షింప
కొద్ది స్వార్థమందు కద్దు కద్దు.

గంపెడు నోటితోడ నధికారముచేయుచు చాటుగా దబా
యింపులు సేయు నీ వొకడ వీశ్వరశబ్ద కిరీటధారివై
పెంపెసలారుచుండ బహువేష విశారదులైన గుర్వులం
బంపెదవేల నీ తరపునన్ నిరుపేదల కొంపలార్పగన్.

నీవున్నావని కానీ
లేవనికానీ వచింపలేక యహింసా
సేవలు చేసిన బుద్ధుడు
నీ వెఱుగనివాడుకాడు నిక్కువమ కదా ?

మతములు సారమున్ బిడిచి మానవశాంతికి నౌషధంబుగా
జతపడ కీర్ష్యలం బెనుచు సాధనముల్ గనుపింప సంశయా
న్వితుడయి స్వీయరాజ్యమును వీడి దయారసదిగ్ధముద్రికా
మదియయి యాలపించె నసమాన జగద్ధితరత్నసూత్రముల్.

ఓటుకు పెట్టినం గెలుతు, వోటమి నాకు నిజంబు, నల్వురే
బాట చరింతురో యని యవశ్యము నా కటుగాక వాదనా
పాటవమున్ వ్యయించి తల వ్రక్కలుగా నొనరించుకొన్న నీ
కోట పునాదిదాటి మొనగూడ చలింప దొకింతయేనియున్.

ఉన్నావో లేవోయని
తన్నుకొనుటకన్న నభ్రతలమున నెందో
యున్నా వనుకొనుటే నా
కన్నిట శుభమని తలంతు నద్భుత చరితా

అడుగదగు నాల్గు మాటల
నడుగక నేనెట్లులందు ? నడుగక మదియం
దుడుకెట్టు లుడుగు ? లోకము
పడు పాట్లెటు దీరు ? నిజము పై కెట్లుబుకున్.

తనువుల్ గోసి కవోష్ణరక్తమున భక్తశ్రేణి పెక్కేడు ల
ర్చనముల్ సల్పిన దర్శనంబిడని పాషాణ స్వభావుండవై
దినముల్ బుచ్చెదునీవు, నిన్నసలు సందేహించుచున్ నమ్మిన న
మ్మని మాబోంట్లను లెక్కసేయుదువె, సన్మానంబు లాశింతువే ?

లేవన్నన్ గలవన్న మాకు నిచటన్ లేవెట్టి యిబ్బందులున్
నీవల్లన్ సుఖదుఃఖముల్ సమముగానే పంచుచున్నావుగా
నీ వైకుంఠమునుండి యూడిపడి నట్లెందెందరో ముక్తికిన్
ద్రోవల్ సూపుడు రంది పొందని వినీతుల్, నీమముల్ నేర్పుచున్.

నిన్ను చూపమని నే నర్చకుని వేడ
చూడు మంచు గుడిని జూపినాడు
గుడికి బోయి చూడ గుండ్రాయి వైనాడ
వెందు కిట్టులెత్తి వేడ్క వచ్చె.

ఉన్నా డొక్క డఖండు డభ్రమున నంచూహింతుమేకాని యె
ట్లున్నావో, యెటులుందువో తెలియకేవో కొన్ని రూపాలతో
నిన్నందంచు ప్రతిష్ఠజేసికొనుచున్ నీ సన్నిధానంబులో
నున్నట్లెంచి తరించుచుంటిమి క్షణాయుష్కక్షమాజన్మముల్.

త్రావుచున్నా రెండమావులలో నీరు
వెడగులై నాలుకల్ పిడుచగట్ట
తిరుగుచున్నారు కుందేటి కొమ్ములకయి
యాత్రికుల్ జరణంబు లరిగి పోవ
కూర్చుచున్నా రభ్రకుసుమ మాల్యంబులు
జోగులై దేహముల్ స్రుక్కిపోవ
సృష్టించుచున్నార సిసుములో తైలంబు
ముగ్ధులై తలకాయ బూజుబట్ట

తలపులందుకొనని నెలవున్నదని పల్కి
వెట్టిమొట్టి కథలు విశ్వసించి
అట్టిచోటు దాచిపెట్టుకోవలదిట్లు
కష్ట పెట్టవలదు జ్ఞాతలమును.

ఊహించితిమి నీకు నాహారమగునంచు
నోరులేనట్టి జంతువుల తలలు
కట్టించితిమి నీవు కాపురం బొనరింప
పాలరాగచ్చు దేవాలయాలు
నియమించుకొన్నాము నీకు మాకును మధ్య
రాజీకుదుర్ప నర్చకుల మూక
తలపోసినాము నీ విలసితాకారంబు
పందిగా పెనురాతి నందిగాగ

జాతులు మతాలు గల్పించు సమరములకు
పుట్లకొలదిగ రక్తంబు బోసినాము
నాల్గు దిక్కులలో ప్రయాణంబు సల్పి
తెలిసికొని పొమ్ము నీవల్ల గలుగు సేగి.

అల్లావో! మరియాతనూజుడవొ! యజ్ఞాకుండవో! శాంబరీ
భిల్లస్వామివొ! బుద్ధదైవతమవో! వేదాంతశాస్త్రాళిలో
వల్లింపబడు శబ్దరూపుడవొ! విస్పష్టంబుగావించి మ
మ్మల్లాడింపక తేల్చి పొమ్ము భవదీ యాజ్ఞాత రూప స్థితుల్.

ఒక్కొక్క మతస్థు లొక్కొక
ఫక్కి న్నామములు పెట్టి బహువిధములుగా
పక్కాణించెద రిందలి
నిక్కువము తేల్చిపొమ్మనింద్యచరిత్రా.

కవ్వింపంగలము నీకన్నను మిన్నగా
చకచక నడచు యాంత్రిక జగత్తు
బందిచేయగలము పంచభూతములను
క్రమముగా మా కూడిగములు సేయ
తెలుసుకోగలము మిన్నులమీద నడయాడు
గ్రహతారకముల సంగ్రహచరిత్ర
కాలూని విహరింపగల మభ్ర మార్గాన
తేలికగా విమానాలమీద

నీవు గల్గియున్న దైవ శక్తులయందు
మూడుపాళ్ళు మాకుగూడ గలవు
నిన్ను చూడగలుగు నేత్ర మొక్కటిదక్క-
పూని నరుడు చేయలేనిదేమి ?

ఒక ప్రాణి కొకప్రాణి యోగిరంబై పోవు
క్షణిక జీవుల సృష్టి సలుపకుండ
హత్య చేయుటకు వీలయిన నెత్తురుచియ్య
జెలగు దేహంబులు చేయకుండ
మనసులో మొలచు కల్మషము దాపగజేయు
హృదయ పేటికలు నిర్మింపకుండ
పసితనంబున ప్రేమరసమయంబై వెల్గు
సాధుస్వభావంబు జారకుండ

ప్రజల నిర్మించి, మాకందుపాటునందు
కాపురముబెట్టి సేవకాగణము తోడ
జగతి కేతెంచి యేల్బడి సలుప మనఘ!
మూగవలె మింట నొకచోట దాగకుండ.

అనలజ్వాలల సర్వలోకమును సంహారంబుగావించి నూ
తన విశ్వంబు సృజింతువందు రది తథ్యంబైన నా ప్రార్థనం
బును మన్నించి సృజింపగోరెద జగంబున్ నేటి దౌష్ట్యంబు పో
కని బంగారపు మంటితో సమరసైక్య స్వాదు భావాలతో.

4)

పొదలు కల్మషభావములు పెత్తనముచేయ
వసతి జిక్కని తేనెవంటి మనసు
అలసుందనపు టసూయా ఘర్షణంబున
వేడికెక్కని దయా వీక్షణంబు
అపకారమునకు బ్రత్యపకార మొనరింప
తీవరింపని క్షమా దివ్యగుణము
పరిపూర్ణ మానవత్వము తట్టుమిట్టాడ
మృత్యుదేవతను జయించు తనువు

సర్వసర్వంసహాచక్ర సహనశక్తి
తొణికియాడగ బ్రతి రక్తకణమునందు
నింపి సృష్టింపు మోయి! నిలింపనాథ
మర్త్యలోకంబు, నీ మాట మఱవకోయి.

విశ్వమందుగల్గు బ్రేమసర్వస్వంబు
ముద్దజేసి హృదయములను మలచి
మెరయు సత్యమెల్ల గరగి రేకులు గొట్టి
సృష్టిచేయుమయ్య జిహ్వికలను.

మకరందమున తేటులకు భోజనముపెట్టు
సుమపల్లవుల వింత చుట్టఱికము
అలిచిప్పలకు ముత్యాల పాపలనిచ్చు
స్వాతి మేఘాల దాంపత్య మహిమ

కష్టజీవుల మేని గండుచెమ్మట లూడ్చి
యోదార్చు పిల్లవాయువుల నెనరు
తలిరాకు హస్తాల బిలిచి నీడల నిచ్చు
ధరణిజంబుల దాన ధర్మ దీక్ష

జ్ఞానధనుడైన మేటి మానవున కీక
ప్రకృతి నిండారు జడ పదార్థముల కిచ్చి
నరసమాజంబు నవమాన పరచినావు
దానగుణ హీనమైన విజ్ఞాన మేల ?

అణుశస్త్ర ప్రళయంబు దెచ్చుకొని దుర్మైత్రిపోవ సంసిద్ధమై
రణభేరిన్ మొరయించు క్రూర మద గర్వగ్రస్తమై బంధు రా
రుణ నేత్రంబయియున్న లోకమున నెహ్రూవంటిశాంతిప్రియుల్
మణిపూసల్ గద నీ యనంత కరుణా మాణిక్య హారాళికిన్.

కోరికలూర దుఃఖమునకుం గురియై మృతిసింహముల్ ఫలా
హారము చేయ విశ్వవలయాంగమునంద్రదన రేణురాశిలో
జేరు మనుష్య కీటకపు చెన్నటి చేష్టలు లేక శాంతి పెం
పారు జగత్తు మాకిపుడవశ్యము సృష్టియొనర్పు మీశ్వరా!

వాడువాఱని పుష్ప పరిమళా సారంబు
చిలికించి తనువులు సృష్టిజేసి
నగ సహస్రములలో బిగియెల్ల గొనివచ్చి
పసరు పాలిండ్లలో పాదుకొల్పి

ఆణిముత్యపు చిప్పలందున్న నైగని
　　　గ్యమును లావణ్యంబుగా బిగించి
తీపిజారని పుట్టతేనె వాకల మూక
　　　అధర బింబంబులయం దమర్చి

కాంతలను సృష్టిచేయని కారణమున
పెండ్లియాడిన భార్యల పిప్పిజేసి
తరుముచున్నవి పురుష భూతములు కొన్ని
స్త్రీత్వమిడి యట్టివారి శిక్షింపవోయి!

పురుషుల్ నిర్మితిచేయు సాంఘిక మహాభూతంబు పెన్ఘోరలం
దిరికింపంబడి దుష్ట భర్తల కృపాహీన ప్రవృత్తుల్ హృదం
తరమున్ అంపపుకోతగోయ నిజహత్యానేరముల్ చేయు సుం
దరుల న్నీ వెటు లూరడింతువో మహాత్మా! ప్రేమవారాన్నిధీ!

సుకముల్ చచ్చినగాక లభ్యపడనంచున్ బెట్టు నీ వాయిదా
లకు నాశించి కరస్థ భౌతిక సుఖాలన్ బ్రక్కకున్ నెట్టు ఆ
స్తికపు న్మందు యెడారిలో మొలిచె ఆస్తిక్యంపు కుళ్ళీ యమా
యకపుం బోరులు సృష్టిచేయవలదన్నా కొత్తలోకంబునన్.

అధికారంబను నల్లమందు తిని దేహంబెల్ల నున్మత్తమై
బధిరత్వంబును దృష్టిమాంద్యము వరింపం బాలిత శ్రేణికిన్
వ్యథ గల్పించెడు దుర్విదగ్ధులను నవ్యక్షోణిలో నీ మహా
రథమున్ లాగెడు వాహనంబులుగ నిర్మాణంబు గావింపుమా!

స్త్రీకంటెం బురుషుండు శ్రేష్ఠుడనుచున్ సిద్ధాంతముల్ చేసితా
టాకుల్ కంఠములెత్తి స్త్రీజగతి కన్యాయంబు గావించెనో
యేకాలంబున పుట్టినింటయువ లేవేనాటి స్వాతంత్ర్యముల్
స్త్రీ:కీ మారు సమాన గౌరవవిభూతిన్ గాంతకుం గూర్పుమా !

వలపుల బిడ్డలం గటికి పస్తులతో హతమార్చి గడ్డిదూ
డల సృజియించి తెచ్చి యెదుటన్నిలబెట్టెడు క్రూరమర్త్యమం
డలముల మోసమున్ దెలిసి నవ్వుమొగంబుల బాలొసంగు గో
వుల సహనస్వభావమును పొందొనరింపుము మామనస్సులన్ !

మానవ జిహ్వాలన్ దనిపి మాబ్రతుకుల్ జరితార్థమయ్యె వం
చానన సీమలన్ బ్రమదహాసరుచుల్ గనుపట్ట నిత్యమున్
గూనలతోడ వధ్యశిలకున్ బరువెత్తెడు గొఱ్ఱెమందలో
గానగవచ్చు త్యాగమును కల్పన చేయుము మా మనస్సులన్.

కమికెండన్నము పెట్టకున్నను బుభుక్షాశుష్కితంబైన దే
హమునందుం బ్రతిరక్తబిందువున నెయ్యంపు న్నిజస్వామి రూ
పము దీపింప భజించు శ్వానముల విశ్వాసంబు రవ్వంత చు
ట్టములందు న్నెలకొల్పు మింకొక యజాండ సృష్టి గావించినన్.

కలుపుంగోలుతనంబు తేటపడ నుత్కంఠన్ మొగాలెత్తి మూ
తులు మూతుల్ గదియించి ముద్దుగొని సంతోషించు చిన్నారి చీ
మలయందున్న పరస్పర ప్రణయసంపత్తిం బ్రసాదించి మ
ర్త్యుల బుట్టింపుము కొత్తలోకమున కొల్తున్ నిన్ను మ్రొప్పెద్దులన్.

అంగవిహీనులై జననమంది యధేచ్ఛ జరించునట్టి వా
రింగని మాకు నంతటి యదృష్టము లేదని దుఃఖభారమున్
మ్రింగి తపించు దీనులకు మృత్యువుముట్టని నీజగత్తు నం
దుం గృపతో నొసంగుము మనోహరరూపము నీప్సితార్థముల్.

కుల మత రాజకీయములకున్ గురికాక సమస్త లోక మం
గళకరమైన సత్యమును కమ్మని వాక్కుల నిర్భయంబుగా
బలికినదే కవిత్వమను వాస్తవమున్ గురుతించు దృష్టి మా
కలవడజేయ కేల సమయాంగన నెత్తిని నంటగట్టితో ?

కలము బట్టినట్టి కవులెల్ల నీలోని
సుగుణగణములెల్ల బొగడుచుండ
ప్రజల కష్టములను బలుకువారెవ్వరు ?
పలికిరేని తలచువారలెవరు ?

ఉన్నవి యెన్నో కళ ల
భ్యున్నతము లఖండ శక్తియుతములు, నీవే
కొన్నావేమో ప్రజల
గన్నెత్తియు జూడ వేమి గతి దీనులకున్?

కలలోనన్ గనిపించినాడవని వక్కాణింతురీ సర్వభ
క్తులు, సాక్షాన్మనుజాకృతిం ధరణియందున్ దోచినట్లొక్కరున్
బలుకంగా విన మద్వితీయుడవు సర్వవ్యాపివై స్వప్నభూ
తల సంచారములేలః మా కివి వివాదగ్రస్త వృత్తాంతముల్.

అన్నమొ దైవమా యని యహర్నిశమున్ దురపిల్లు పేదకున్
గన్నులు చెమ్మగిల్ల చిరకాలము నీ పరమార్ధ మిష్టమృ
ష్టాన్నముగా భుజింపుమని యాకలి దీర్పగ జూతువేల ఆ
పన్నుల కేమి మేలు? ధనవంతుల మేలుకె మంత్ర తంత్రముల్.

గుడిలో నున్నని బండవై అనుగు భక్తుల్ నీకు చూపించి సా
పడినట్లెంచి ప్రసాదముల్ గుడిచి తత్పార్శ్వంబులం బిచ్చమె
త్తెడు కంకాళ సహస్రమున్ గసరి గద్దింప న్నివారించి తో
ద్పడగా దొమ్మలు లేనివాడవయినావా? శక్తిహీనుండవై.

వట్టి యమాయకంబులయి, పట్టెడు మేతకు రక్తమాంసముల్
కట్టిడి మానవాళి సుఖంబులకై వ్యయపెట్టి, తిట్టినన్
గొట్టిన నోర్చు జంతువుల గొంతుల నూడిచి సత్రికొల్పులన్
బెట్టెడ రసజ్ఞు లెప్పటికి నీ హృదయంబు ద్రవించునో ప్రభూ!

అగుపడవా? ప్రభూ! తనువు లాహుతిజేసి సహస్ర వర్షముల్
జగములు తల్లక్రిందయిన శాశ్వతకాలము మాకు ముక్కునన్
మొగమును లేని కొండపయి ముచ్చియొనర్చిన లక్కబొమ్మతే
భగవతులా? అభాగ్యములుపాపయుతమ్ములు మర్త్యజన్మముల్.

ఆదినరున్ సృజించుటకునై యొక తట్టెడు మన్ను నప్పుగా
మేదిని నుండి పుచ్చుకొని, మృత్యునెపంబున మానవాళియం
దూదిన గాలి పీల్చుకొని యుర్వికొసంగి ఋణంబు నీగు నీ
మైదు గ్రహింపలేక పరమార్థము పల్కుదు రీ మునిబ్రువుల్.

నిను గన్గొంటకు శక్తి చాలదట యీ నేత్రాల కేవో మన
స్సున నాధ్యాత్మిక నేత్రముల్ మొలిచి చూచున్నిన్నటం ద్రష్టలో
చనముల్ పుట్టువుతో నొసంగక వృథా చక్షుల్ ప్రసాదించి యి
ట్లనుమానంబున ద్రోయనే? ఏను మాయానాటకం బేటికో?

ఆలోచింప జుగుప్స గొల్పెడు వరాహాద్యాకృతుల్ దాల్చి నీ
వీ లోకాన సముద్భవించిన కథల్ సృష్టించి చాటించినన్
హాళిందేళి నివేదనల్ గొని యభీష్టార్థంబులం గూర్చు నీ
బోళాబుద్ధి ప్రశంసనీయము జగత్పూజ్యంబు లోకేశ్వరా!

ఒక్క పొగడ్తతో హృదయముబ్బి యఘంబులు పిండిపిండిగా
ద్రొక్కి వరంబులిత్తువట, దొంగలు మానవహంత లిట్టి నీ
చక్కని చిత్తముల్ దెలియజాలక, టక్కరి మొక్కుబళ్ళతో
చక్కిలిగింత బెట్టెదరు స్వార్థపరుల్ నిజకార్య సిద్ధికై.

అణువును వ్రక్కలించి ప్రళయాగ్నుల నిద్దురలేపి విశ్వ మా
రణమున కుద్యమించినవి రాక్షసభూము లకారణంబుగా
నణువునగూడ నీవు కలవందురు, సృష్టిరహస్యదృష్టి దు
ర్గుణుల కొసంగి యెంత చెడుగున్ ఘటియించితి వభ్రమందిరా?

మా జాతీయత మా కళా ప్రతిభ సామాన్యంబు కాదంచు వా
చాజాడ్యమ్మున నన్యులందెగడు నస్తావిస్తముం బాపి నా
నాజాతీయ గుణైకదృష్టి నిడి మా నవ్య స్వతంత్రోర్వరా
ఠాజీవంబును దిద్ది తీరుపు మ నీర్ష్యాసౌరభశ్రీలతో.

త్రసరేణ్వంతరమందు డాగిన యనంతంబైన శక్త్యున్నతుల్
వసుధారాజ్య పిపాసపీడితుల కేలం జిక్కి విశ్వంభరన్
మసిగావించుట కుద్యమించిరి మహాత్మా ! గుండెలల్లాడ సా
ధ్వసభుగ్నంబయియున్న దెల్ల జగ మేపక్కి న్నివారింతువో?

ఒక చలిచీమకూన తనువూడ్చిన నేడ్చు దయాపయోనిధుల్
సకల జగత్ప్రబోధకులు శాక్యమునుల్ ప్రభవించి జాతిగుం
డెకు నవనీతభావములు నేర్పిరి సృష్టిరహస్య మమ్మహా
సుకృతుల కందనీక గుణశూన్యుల కిచ్చితివేల బేలవై?

ఆశల కెక్కసాగె భరతావని బంపు ననంత శాంతి సం
దేశము, లస్త్రశస్త్రముల నీచ రణప్రళయంబు లార్పు మా
ఆశయముల్ సుధామయము లాత్మపరాయణమైన క్రూర పుం
భాశవిక ప్రవృత్తిగల మానవతల్ ననలెత్త విచ్చుటన్.

మరుగొనరింపనేల యొకమాట జగత్పరిరక్షణార్థమై
ధరకొకమాటు నీదగు రథంబు మరల్చిన గొప్పవారి మం
దిరముల స్వాగతంబుగొను నేటి నియంతలట్లుగాక, మా
హరిజనవాడలం దొలుత నర్ఘ్యముగొమ్ము దయాపయోనిధీ .

పన్నీటితో నీకు పాద్య మీలేరైన
కన్నీట పాదాలు గడుగగలము
మణిపీఠముల నిన్ను మన్నింపలేరైన
హృదయాసనములు వేయింపగలము

పరమాన్నమున దృప్తి పడుపంగ లేరైన
కాయకష్టపు గంజి బోయగలరు
టెంకాయతో నిన్ను బొంకింప లేరైన
తలకాయ లిడి నిన్ను గొలువగలరు

అట్టివారి కాసు లపహరించుచు గుళ్ళు
గోపురాలు గట్టుకొనెడు నీకు
మొగము చెల్లదేమొ తగుదునమ్మాయంచు
నళుకు బెళుకు లేక పలుకరింప.

గణనకురాని యీ పరమ గర్భదరిద్రులమూక యేమికా
రణమున భిన్నమయ్యెనొ పరాత్పర ! గ్రాహ్యముగాదు దేవతా
గణనమున కేని, మాదిగలుగా యొకగుంపు జగంబులో చలా
మణి యగుచున్నదీ రుజనుమాన్పు మహౌషధముల్ లభించునా ?

కలిమి లేములలోన టక్కరితనంబు
కలిమికేగాని లేమికిగాదు తలప
పంచముల పేటలో జేరి పడకవయిచి
లేచిపోలేదు నేటికి లేమి నెలత

ఆదట ఫాలనేత్రుడు స్వయంభువు డెల్లపు డన్నపూర్ణతో
వేదయుగాలనుండి పదివేల గణంబులు కొల్వుచేయగా
పాదము క్రమ్మరింపక నివాస మొనర్చెడు వారణాశిలో
పాదము మెట్టినన్ బరమభక్తుల వైఖరు లర్థమయ్యెడిన్.

లంగాగట్టి నెఱుంగనట్టి యత్రిబాల్యం బందె కామించి ఖ
ట్వాంగస్వామిని పెండ్లియాడి ఘనజూటాగ్రంబునందెక్కి ఖం
గాంగస్పర్శల తైర్థిక ప్రజకు పుణ్యంబుల్ ప్రసాదించు న
గ్గంగా దేవత నిన్నుజూచి యెదబొంగం బూల పూజించెడిన్.

తప్పక వచ్చిపోవలయు ధారుణికి న్నవభారతంబునం
దుప్పర మంటగా వెలసియున్నవి బంగరు గుళ్ళ గోపురాల్
కుప్పలు తెప్పలై నరునకుం దలవాల్పగ తావుజూపి మా
యప్పనముల్ గ్రహించి చనుమా! అనుమానములెల్ల దీరెడిన్.

ఇక్కడ నిండ్లుగట్టుకొని యిచ్చు ప్రసాదము లారగించు నీ
మ్రుక్కిడి వేల్పులెల్లరును ముక్తినొసంగ సమర్థులౌదురో
టక్కరి సేతురోయని యెడంద లొకించుక సంశయించెడిన్
నిక్కము దేల్చి బొమ్మ కరుణించ ప్రపంచము సంతసించెడిన్.

హిమవత్పర్వత పంక్తిపైగలవు నీ కిండ్లందు కైలాసభూ
ధ్రము పై నెక్కిన భారతోర్వర సమస్తం బక్షియందుండు ని
త్యము నీకై తపమాచరించు మునిబృందం బందు గన్పట్టు ను
త్తమమౌ సృష్టివిలాసమెల్ల నట ప్రత్యక్షించు నుచ్చండమై.

కాళిదాసుని జగా ఘంటాన నొలికిన
మధురాక్షరముల సన్మానమంది
శూలాయుధుని దొడ్డ యాలపోతుల తేని
మహిత ఖాంకృతులతో మారుమ్రోగి

మూడువేళల నృత్యములు సల్పు శివుని పా
దాఘాత ముద్రిక లలితదాల్చి
గగనాపగా తరంగాల దూకుడుచేత
ఘోషించు బంగారు గుహలతోడ

దట్టమైన దేవదారు తోటలనుండి
ప్రసవమైన దివ్య పరిమళమున
స్వాగతం బొసంగ సకల భారతము నీ
కనులముందు నిల్చు క్షణములోన.

కొండలయల్లుడై నగము కొమ్మ లకొండొకచోట భద్ర వే
దండపు చర్మధారియయి దర్శనమిచ్చు భవానితోడ భ
ర్గుండు త్రిమూర్తులందతని గొప్పగ నెంతురు శైవకోటి వి
ష్ణుండురువంద్రుడు వైష్ణవజనుల్ జగడాలు పరిష్కరింపుమా

అచ్చటి సన్మునికోటికి
నచ్చవు పెను రాజకీయనాటకములు, రా
లచ్చులకు బెనుగులాటలు !
కచ్చలు కార్పణ్యములు టగాజీవనముల్ .

అదిగో చక్కని పద్మరాగముల చాయల్ కుప్పగా బోయుచు
న్నది బ్రహ్మాండము నేత్రపర్వముగ,సంధ్యం దాండవంబాడుచు
న్నది విశ్వంబు మయూరమైహృదయపింఛంబు ప్రసారించి, యి
ల్లైడ నూరించెడు దృశ్యముల్ గలవె స్వామీ ! స్వర్గధామంబునన్ .

వలపుల్ నింపుచు కన్నుగీటుచు ప్రతిప్రాణిన్ వివాహాబ్ధిలో
పలికిన్ నెట్టు ప్రపంచమోహినికి నీ స్వర్గా లసంఖ్యాఖముల్
తులరా వభ్రము డిగ్గి రమ్మిటకు మాతోగూడి బంగారుమే
డలలో సౌఖ్యము చూరలాడుము ధనాఢ్య శ్రేణి సేవింపగన్ .

వెలుగున్ జీకటి కష్టమున్ సుఖము సుర్విన్ సృష్టిగావించి ఆ
శలకుం బాదులునిల్పి శాశ్వత సుఖస్వర్గంబు బ్రహ్మాండ మం
డలమం దెచ్చటనో సృజించుకొని యానందించు నీ వింతచే
తలె మమ్మీగతి పాలుజేసినవి వేదాంతాటవీ వల్లభా !

కోరున గూఎనన్ దొరుకు పుణ్యజగత్తున రంభతోడ సం
సారసుఖం బటన్న నుడి శ్రావ్యముగా వినుపింప రాజబృం
దారకకోటికై తనువు దానముచేసిన యోధకోటికీ
మారు శతాయురభ్యుదయ మంజుల జీవితముల్ ఘటింపుమా !

మతకలహాగ్నిలో గరగి మన్నయిపోయిన మూర్ఖమానవ
ప్రతతుల రక్తనిర్ఝరుల ప్రత్యణువుం బరిషిక్తమైనదీ
క్షితి కరుణాపయోనిధివి సృష్టినియంత వెటుల్ సహించి యీ
పతితజగత్తుమీద పదపద్మము లూని చరింతువో ప్రభూ !

తిన గూడండని పేద సాదుల మహార్తిన్ గ్రాగి పెల్లుబ్బు వె
చ్చని నిట్టూర్పుల దూషితంబయి ప్రపంచప్రాణమున్ పేరుగాం
చినదీ గాడ్పు పుటంబునంబడక సంసేవ్యంబు గాదెట్టి పా
వన వాతావరణంబు గూర్చెదవా దేవా ! నీ పునఃసృష్టిలో.

బిగి గుబ్బల్ వెలికుబ్బి బుగ్గల గులాబీవన్నె రాణింప చి
ర్నగవుంజూపు టలుంగులం బరిపి యారాధించు దుర్గమ్మ యొం
టిగ చేజిక్కగ పాపకచ్ఛదములన్ ఛేదించి చేపట్టడే
సెగకన్నున్న శివయ్య మారుని శరార్చిజ్వాల సామాన్యమే .

నిండు జాబిలిలోన పండిపోయిన హాయి
చిరునవ్వు తునకలో జిలికినావొ
పుట్టతేనియలోన మిట్టాడు మధురిమ
నధరబింబంబులం దదికినావొ
కులపర్వతములలో నెలకొన్న బిగువెల్ల
గుబ్బపాలిండ్లలో గ్రుక్కినావొ
అణిముత్యాలయందలరారు మెరుగును
మేనుదీవెనలోన మెదిపినావొ

హృదయవేద్యమైన ఎంతతీపి బిగించి
మగువ నద్భుతముగ మలచినావొ :
నాడు శతమఖుండు కోడిపుంజైనాడు
మేనుమరచి అడుదానికికొఱకు .

కోటియుగాలకున్ రసము గ్రుంగని నీదు వసుంధరా మహా
నాటక కావ్యరాజమున నాలుగునాళుల పాత్రధారినై
చాటునకేగు నావెడగు సాహసమున్ క్షమియింపు మిందులో
లోటులు దిద్దుకొమ్ము కవిలోకము మెచ్చ జగత్కవి ప్రభూ :

కవుల సృష్టిలోన గనుపించు ప్రతి పదా
ర్థంబు రసమయంబు నమృతమయము
విశ్వకవివి నీవు విషమ్మయంబగు నుర్వి
గోళ మేకతాన గోచరించె ?

సగము తెలివి, గుణము సగము, సంతోషంబు
సగము, కలిమి సగము, సగము శక్తి
సగము బ్రదుకు నిచ్చి సగముంచుకొన్నావు
నిండుభక్తుడెందు నీకు దొరుకు ?

నీ రత్నాల వికుంఠభోగ గరిమల్ నీ శాశ్వతానందముల్
నోరూరించు కథల్ పఠించి జగమిందున్ దీర్ఘనిశ్వాసముల్
సారించున్ దివికెక్క జూచు మృతిపంచాస్యంబు నడ్డంబుగా
పారాబెట్టితి వీశరీరమున నా భాగ్యంబు ప్రాప్తించదా ?

భవ ముత్తరింప నపుడపు
డవతారం బెత్తనేల ? ఆ స్వర్గంబున్
భువికిం దరలించినచో
వివిధ మతోన్మత్త రుజులు విరమించుగదా .

బత్తెము చేసినావుగద ప్రాణులనెల్ల దయావిహీనమౌ
మిత్తికి, హాయిగా సకల మేదిని మీద నిరంకుశంబుగా
పెత్తన మాచరించెడిని పేదకు బొక్కెడు కూడొసంగ నీ
చిత్తము సమ్మతింపదొ విచిత్రము లీ వలపక్షపాతముల్.

బలమైన నగరాలు నలిగి రక్తముగ్రక్క
దెసల భూకంపాలుతెచ్చి పెట్టి
వేలవేల్నిండు ప్రాణాలు నీళ్లైపోవ
అగ్గికొండల గుండియల నగల్చి
ప్రతిరక్తకణము నాహుతిజేసి భక్షింప
సకలజాడ్యాలకు సైగజేసి
జనపదంబులు నీటమునిగి ముక్కలుగాగ
గాలివానల కింత కన్నుగీటి

హృదయముండని కిగ్గాడి మృత్యువునకు
విందులు వినోదములను గావింతువేల ?
తలప కాకులగొట్టి గ్రద్దలకు వేయు
పనులు తగవయ్య బ్రహ్మాండ పాలకునకు .

నీవు జగత్తుమీద పయనించి పరిస్థితు లాకళించుకో
లేవనుకొందు, సత్యము హుళిక్కి, నిజాయితిసున్న, యేకతా
భావము శూన్య మిట్టి దురవస్థకు లోనయియున్న భూమిలో
నీవు పదంబు మోపకుము నిక్కము గుండియలాగి పోయెడిన్.

స్వాగతమీయ వచ్చెదరు స్వార్థపరుల్ దయలేని దొడ్డ యు
ద్యోగులు సీమసంస్కృతులతో గరచాలన మాచరింపగా
త్యాగపరాయణుల్ బలె, సభాలయ కుడ్యము లూడియాడిమా
ర్మోగ నుపన్యసించెదరు భూమికి డిగ్గిన దేవతల్ బలెన్.

పరదైసుం గనినాడ స్వప్నమున తత్పార్శ్వంబునం దగ్ని సా
గర మభ్రాంత నటత్తరంగములతో గన్పట్టి నందీ వసుం
ధర పుణ్యాత్ముల జాబితాలగల పెద్దల్ కొందరున్నా రదే
నరకంబౌనని యూహజేసితి జగన్నాథా ? యదార్థంబకా!

అకట తూలితూలి జఠరాగ్నికి నింధనమై జగంబులో
నీకు శిరంబువంచక జనించినదాది దరిద్రదేవతా
భీకర దంష్ట్రిలన్నలిగి విశ్వము వాసినవారు కొంద ర
వ్యాకుల చిత్తులై సుఖములందుట గంటి వికుంఠ సీమలన్.

వాక్కును మానసం బెగసిపట్టిన నందనివాడు, కంటికిన్
జిక్కనివాడు, భక్తికి వశీకృతుడై సచరాచరంబున
న్నిక్క వెలుంగువా డెపుడు నాశములేని స్వయంభువుండు న
ద్దిక్కుల గోచరించె రవిదీప్తుల నాతని కంజలించితిన్.

మత కలహాపదేశమున మానవరక్తము ద్రావుచున్న దీ
క్షితి శమియింప లేదిపుడు దీర్ఘ విదాహ మి కెంతకాల మీ
వితముగ మిన్నకుండెదవు బెల్లముగొట్టిన రాయివోలె నె
న్నితరము లీ యనూహ్యసరణి న్నడిపించెదవో ప్రపంచమున్.

గుంపెడు బిడ్డలన్ మెడలకుం గుదిగట్టి నివాసముండగా
కొంపలు గోడులుం దినుటకుం బిడికెం డశనంబునీక పూ
జింపనివారల న్నరకసీమల ద్రోయుదునంచు వార్తలం
బంపెదవేల నీ యనుగు భక్తులచేత నిలింపనాయకా!

మరణం బందినవారి యాత్మ లవి యేమార్గాన నీ చెంతకుం
బరువుల్వారు నసంతికోటి విగతప్రాణంబు లెచ్చోటి నే
తరహా జీవన మాచరించు, నిట సంతానంబు గావించు ను
త్తర కర్మల్ పరలోక యాత్రికుల ఆత్మక్లేశముల్ మాన్పునా ?

కవులున్ గాయకులెందరో గగనలోకం బెక్కినా రీకళా
వ్యవసాయం బట సాగునా ? అమర విద్వద్గోష్ఠులం దెట్టి గౌ
రవ మర్యాదల కష్టులయ్యెదరు ? తద్రంభాప్సరః కామినీ
నివహాశ్లేష సుఖంబు వీరులక కానీ ? యొర్లకుం జిక్కదా ?

కవి దేహంబు త్యజించి మింట నొక నక్షత్రంబుగా మారిత
ద్భువనంబున్ వెలిగించు దీపమయి యుద్భాసిల్లు నంచ్రట్టి వా
డవని న్నిత్యదరిద్రుడయ్యు నిజకావ్యానందలోకంబునన్
దివులున్మాని సుఖించు నల్పతరతృప్తిన్ రిత్తమర్యాదలన్.

బ్రతికిననాడు లేని భగవన్మహిమల్ దగిలించి మృత్యుదే
వత జఠరంబుజొచ్చిన యభాగ్యులకుం గుడిగోపురాలు ని
ర్మితి యొనరించి పేదల పరిస్థితి నెంచని వింతపుణ్యదూ
షితుల సృజింపబోకు మిక చెల్లవు నీధనికాభిమానముల్.

పలువన్నెల్ కనువిందుసేయ వనదేవస్త్రీల కౌగిళ్ళలో
కలనాదంబొనరించుచున్ గగనమార్గంబందు క్రీడించు పి
ట్టలలో కొండొకపిట్టనై బ్రదుకుటిష్టంబయ్యెడిన్ దుష్టచిం
తలతో జింతిలు మానవుండ నగుకన్నన్ లోకలోకేశ్వరా ?

నవ్వవు జంతువుల్, నరుడు నవ్వును, నవ్వులు చిత్తవృత్తికిన్
దివ్వెలు, కొన్ని నవ్వులెటుతేలవు, కొన్ని విషప్రయుక్తముల్,
పువ్వులు వోలె ప్రేమరసమున్ వెలిగ్రక్కు విశుద్ధమైన లే
నవ్వులు నాకు నిమ్ము ఘవినాశక ! వ్యాధులు సోకవెన్నడున్.

మున్ను విషాదపూరితో క్తి పరిపూర్ణ విశిష్టతగల్గి సత్కవుల్
మన్నన లందినారని తమాషకథల్ వచియించుచుండ్రు నే
డున్న కవిప్రబుద్ధు లనృతోక్తుల నాటివిషోక్తులెన్నగా
యన్నలు దమ్ములన్న విషయంబు మనంబున విస్మరించుచున్.

కలరు పతివ్రతల్ కలియుగంబున గూడ, గయాళులైన య
త్తల కరకుండనమునకు దాళి పొగల్ సెగలన్ వెలార్చు భ
ర్తల పదపద్మముల్ గొలుచు దైవకాంతలు, వారి వేదనా
జ్వలన శిఖావళిం జిదుమజాలవు నీ వివిధావతారముల్.

కరముల్ మోడిచి గౌరవింతు రనురాగంబుం బ్రదర్శింతు రీ
శ్వర భక్తిం బ్రకటింతురన్న ప్రతిశబ్దంబందు నేదో మహ
త్తర భావంబు గ్రహించినట్లు నయనాంతస్పందనల్ సేతు రీ
తరహామాయకుళాయి దాసుల ప్రమాదం బెట్లు వారింతువో ?

ఆవుపెరుగు గోరకర్థించె మును కాశి
దాసు గేదెపెరుగు ధరణిపతిని,
అవునట్లు గేదె నాదరింప రదేల
వెన్న దొంగ ! మన్నుదిన్న రంగ !

గోశాలల్ నెలకొల్పనార మిట పెక్కుల్ గోశరీరాలతో
నాశాదేవత శల్యరూపమున గ్రాసార్థంబు ఘోషించెడిన్
నైశా కుంకుమ పూజలన్ దనుపుచున్నం బాపమా మూకగో
రాశిం బెత్తెడు కండచేరదిక మార్గంబేది లోకేశ్వరా ?

కరికి ప్రాయంబు తనువల్లికలకు గూర్చి
కోర్కెలకు గుల్కు ప్రాయంబు గూర్తు వేల ?
ఈడుజారిన వార్ధక పండితులకు
ఆశలకు సాటి శిక్ష లస్యములు గలవె ?

మన మత్యుత్తమ వంశజాతులము సుమ్మా ! నీచులంజేర వ
ద్దని లేబ్రాయమునందె బిడ్డల కసూయాద్వేషముల్ నేర్పి, క
ప్మని బుద్ధుల్ విషతుల్యముల్ సలుపు నమ్మల్ నమ్మరీనాటి నూ
తన సామాజిక సత్య శాంతి సమతా ధర్మ ప్రబోధమ్ములన్.

మనుజుం డగ్రగరణంబులో మడిసి రంభంగూడు నంద్రాజిలో
తనువుం బాసిన వీరకాంతలకు నేతద్భోగ మెట్లబ్బునో
యని ప్రశ్నింప జవాబురా దబల కిందందున్ గతుల్ దుల్చివం
చనగావించు కథాప్రణేతలను పశ్చాత్తప్తులం జేయుమా !



# మలికోర్కె

కవిబ్రహ్మాండము నేలు వా డతని యంకంబెక్కి యర్ధాంగి రెం
డన స్వర్గంబయి యేలుచుండు నతనిన్ సాంసారిక క్లేశముల్
తవుల న్నీకటువంటి దంపతుల నేస్తంబున్ విదారించి స
త్కవితా కంఠము నుత్తరింతు విదియు క్తంబౌనె భక్తప్రియా!

నా సృష్టించు జగత్తుకుం బ్రతిగ జింతల్ జీకులున్ లేని భా
షా సౌందర్య సుధాజగఁబులు నిమేషంబందు గల్పింతు రం
చీసుంబూని సతీవియోగములతో హింసించుచున్నా విదే
నా ? సాహిత్యవనీ తపస్వులకు సన్మానంబు లోకేశ్వరా ?

సంసారంబను క్రూర సింహమునకున్ సర్వంసహా చక్రమున్
మాంసాహారముగా నొనర్చిన మహా మాయాసముద్రుండవై
హింసింప దొరకొంటి వేమిటికి స్వామీ ! యొక్క మారీ మను
ష్యాంశంబుట్టి సతీవియోగ విషభక్ష్యం బింత భుజింపుమా !

కడిమిన్నీ వు ధరించు మారణ గదాఘాతంబు సోకం బొడిం
బొడియై దేహములూడ్చు ప్రాణి నిచయంబున్ జూచి పాషాణముల్
జడముల్ బిట్టుగరంగి యేడ్చెడిని నిశ్శబ్దంబుగా నీ కనుల్
తడిగా వీకరిన స్వభావమెపు డార్ద్రింబౌ ? నజాండాలయా !

పచ్చ పచ్చని పతివ్రతల జీవితరేఖ
గడియలో నడుగంట దుడిచివైచి
శాంతి భాజనమైన సంసార జలధిలో
బడబానల జ్వాల పాదుకొల్పి
సత్కళాపరులైన సత్కుటుంబములమేను
నగమూర్చి మృత్యురాక్షసికి నిచ్చి
పరిపూత మాతృ సంపదకు మేల్బంతులౌ
పసిడిబొమ్మల కాటి పాలుచేసి

బంధుకోటుల క్రొవ్వేడి బాష్పనదుల
స్నాన మాడుచు పరుషదూషణములెల్ల
భూషణంబుగా దాల్చి మురిసికొందు
వెందుకీ యపఖ్యాతికి యదృశ్య చరిత ?

జాలికి పుట్టినిండ్లయిన చల్లని నీ నయనంబులన్ విష
జ్వాలకు తావులేదని ప్రవక్తలు బల్కుదు రెందుకీ కవీని
ద్రాలయ రత్న దీపశిఖనార్పితి వంధ తమస్సులో కళా
బాలిక తల్లిలేనిదయి భగ్న మనోరథమై తపించెడిన్.

అంతములేని సంసృతి మహాంధ తమోగ్ర నిశీథమందు కా
సంత వెలుంగుగా హృదయశాంతి ఘటించు చిరరత్నరత్నపుం
బంతిని దొంగిలించితివి భర్త గృహంబున లేనివేళ, వే
దాంత రహస్య వాసివిగదా కికరించుట సాజమేకదా ?

బలమైన యాధారములు లేక జీర్ణించు
నీ చరిత్రకు పైడినీరువోసి
పతన దుర్గతికి బాల్పడి యండ లెడబాయు
దుర్గాల కిన్ని మెత్తులు వగిల్చి
తలతోక లేక గందరగోళమున ద్రోయు
తత్వ బోధలకు నర్థాలు గూర్చి
పనిపాటు లేక అపద లుర్వి కెగజిమ్ము
సృష్టిలోగల గుట్టు చివికి చూపి

నీకు శిరము వంచి నీ పాదయుగళికి
యూడిగంబు చేయుచున్న యట్టి
వశ్యవాక్కులైన వరకవీశ్వరులను
వచలినావు—దొడ్డ వాడవోయి !

నీ వేదాంత వనాటనత్వమును సందేహించువారిన్ సుధా
భావాలంకృత శబ్దజాలములతో ఖాకట్టుగావించి నీ
దైవత్వంబు స్థిరీకరింతురు కవుల్ తద్బంధువర్గంబు వా
చావైదుష్యము దెబ్బతిన్న నవకాశంబేది ? నీగద్దెకున్.

ఒక యేడాది ధరాసుతావిరహసహ్నుల్ జిత్తమున్గాల్ప దై
వికశక్తుల్ గల రాముడంతటి జగద్వీరాధివీరుండు కం
టికి ముప్పందుముగాగ నేడువడె యీనిర్భాగ్య సంసారి వా
ర్థకబారాలను డోర్చుకోగలడె భార్యాజ్యోతి జల్లార్చినన్.

నిన్నొక పెద్దజేసి యువనిం బదిమందికి చాటిచెప్పి యె
న్నెన్నొ సమాఖ్యలుం బిరుదులిచ్చి నభంబున దాచిపెట్టి వి
ద్వన్నిచయంబు గుండియలపై పెనుకుంపటు లెత్తినావు నీ
కన్నము జిక్కెనాధరణియందు? కవుల్ కల మందుకొన్న చో.

దాంపత్యం బిది దైవదత్తము సుఖాంతంబౌ జుమీ యంచు లా
లింపుల్ బల్కి పురోహితుల్ పనసవల్లించిరీ తంతు నీ
కింపైయున్నది యోగమెట్టులగు నిట్లీజంట బాపంగ నై
లింపాధీశ్వర! ఆగ్రహింపవల దల్పీభూత చేతస్కుడన్.

నా యర్ధాంగిని నాకొసంగు మభిమానంబుంచి యింకొక్క మా
రాయుర్దాయముబోసి కోరను త్వదీయ స్వర్ణవైకుంఠమున్
నీయూరింపు టమర్త్య భోగములు నానెయ్యంపు టిల్లాలు నా
కీ యుర్విన్ సమకూర జేయగలదోయీ! లోకలోకేశ్వరా!

సుకృతుల్ శుద్ధమనస్కులున్ గుణగరిష్ఠుల్ దేహముల్ వాసిపో
యక నీగద్దియ కీన లావలను దివ్యజ్యోతులై పొల్తు రం
ద్రకలంకాశయ! నా సతీమణి త్వదీయాగారమందుండి త
ప్పక కూర్చున్ నవరత్న దీపముల శోభం బ్రాభవోపేతయై.

ఆత్మజాయా వియోగాగ్ని తప్తంబైన
కన్నీట దడిసిన కలముతోడ
అనుకూలవతి ప్రియాంగన దాటిపోవ శూ
న్యంబైన భిన్న మనస్సుతోడ

అనుగుటిల్లాలు వండిన నంటకోస మా
శించి చప్పబడ్డ జిహ్వతోడ
ప్రేయసీ మధురాస్యబింబ దర్శనకాంక్ష
దశదిశల్ నెమకు నేత్రములతోడ

సతిని సాగనంపి షష్టిహాయన వయో
భరముతోడ పలితశిరముతోడ
కలము దాల్చునాడు సలుకుకోర్కె చిత్త
శాంతి చేయుమయ్య ! చక్కనయ్య !

తేనియలూరుపుష్పమును తేటులు జుమ్మని క్రమ్ము రీతి నే
వో నవకంపు భావశత మూరక రేగి శిరస్సులోన గా
లూని తుపాను రేచ మది కూరటజిక్కక శబ్దరాశిలో
స్నానముచేయు సత్కవికి సాగవు దీర్ఘ కుటుంబభారముల్.

తెలుగు కవిత్వమన్న నొక తెన్నునబోయెడు పద్దుగాదు ప్రా
సలు గణముల్ యతుల్ పదము సాగగనీయవు కట్టుబాట్ల సం
కెలలు విదల్చి భావమతికించుట దుర్ఘట మక్కటక్కటా
వలదు విరోధికిన్ దెలుగు వాక్కవితల్ కడు వేదనానిధుల్.

జననంబందినదాది నేకనిన యీ సర్వంసహా నాటకం
బున నానావిధ పాత్రధారులయి రేపుల్మాపు లాటాడి పో
యిన పోనున్న నటీనటోత్తముల ఆయాఘట్టముల్ నీ వెఱుం
గని వేముండు జగత్ప్రభూ అయిన నాకర్ణింపు మూకొట్టుచున్.

7)

పూజలో మోజులో పోల్చుకోలే రిప్డు
దైవాలు పెనుభక్తి తత్పరతలు
వట్టివో గట్టివో వర్ణింపలేరిప్డు
దేశంబు తత్త్వోపదేశములను
కష్టమో యిష్టమో గ్రహియింపదీనాడు
సంఘంబు పెద నమస్కారములను
కల్లలో బొల్లులో కనుగొనలేరిప్డు
ప్రజలింక వేదాంత భాష్యములను

ఉక్తి లోక వంక కార్యంబు లొక్క వంక
పయన మొనరింప జీవితభ్రష్టనౌక
నడుపుచున్నారు నీ యనంత ప్రశాంత
చిత్త మేలాగు మమ్ము శిక్షింపగలదొ !

ఏగితి నొక్కనాడు కవియింటికి దోసిలిబట్టి కావ్యముల్
ప్రోగులువెట్టి తీసికొనిపొమ్మిది సాధనమంచు పాపమా
జోగి వచించె నేను పరిశోధనజేసితి నాకు నందులో
త్రాగుట కింత గంజి కనరా దవి జీర్ణముగాని ఖాద్యముల్.

గానము శిల్పమున్ గవిత కష్టములందెగటాప్పు సాధనా
లైన దినాలకోసము సహస్ర యుగంబులనుండి విశ్వ మా
శానయనంబులన్ దశదిశల్ పరికించుచున్న దీ జగ
ద్గ్లాని యడంగునా తపితగర్భములం దమృతంబు సోకునా.

సానల్ దీరినరత్నరాసులయి సాక్షాత్ స్వర్గమున్ దించు నీ
నానా కావ్యజగత్తులో దివిజకాంతల్ దివిజకాంతులున్ భోగులై
ఆనందించుచు ధారుణీ నరక మందల్లాడు దౌర్భాగ్యపు
న్మానుష్యంబును విస్మరింతురు గదన్నా ! సాహితీ కర్షకా !

భూవరుల జెందె మును నీ
పావన కవితా మృతంబు, ప్రకృతమునందునన్
దేవతల జెందుచో మా
కేవిధి లభ్యంబులౌ నభీష్టార్థంబుల్ ?

కవి నా మాటకు కంట నీరిడుచు నక్కాణించె నీరీతి ని
క్కువముం బల్కితి ఏ మహాకృతులు నీఘోరక్షుధాశాంతి చే
యవు శృంగార రసాంచితంబులు పరార్థాసక్తముల్ దేవ మా
నవ రాజన్య కథాపరాయణములన్నా ? లాంగలీ పాకముల్.

పూదోట లంతిపురములు
వేదాంతార్థములు మాకు ప్రియతమములు, మీ
వేదన పేదఱికమ్ములు
కా దవి నాజూకు నరుల కర్ణజ్వరముల్.

నాస్తికుల సామ్యవాదుల
మస్తిష్కమునందు పతితమానవతతికిన్
గాస్త జగా కలదేమో
నాస్తి సుమీ కరుణ కీదినాలం గృతులన్.

గుంపెడు బిడ్డలు చినిగిన
కొంపయు బెండ్లాము చింపిగుడ్డలు మూలన్
గంపెడు ఱాతి శలాకలు
తుంపలు సుత్తెలును యులులు దోచం జెంతన్.

ముక్కద్దంబుల చట్రపు
ముక్కల నేదోవిధాన ముడిబెట్టి చెవిన్
జెక్కి శిలాఖండంబుల
జెక్కదొడగె శిల్పి మేన చెమ్మటలూరన్.

ఒకొక్క సుత్తెదెబ్బ కొక యుజ్జ్వల మానవమూర్తి వెల్లగా
నిక్కి శిలాంతరాళ కమనీయ శరీరము దాల్చుచుండగా
అక్కజ మంది యింతటి కళాంబుజ సూతి దరిద్రదేవతా
దృక్కుల కగ్గమై ననసెనేయని కన్నుల నీరు నించితిన్.

హరి హర పద్మగర్భులు సుధాంధసు లాతని సుత్తెదెబ్బతో
కర చరణాంగికాభినయ గర్భిత భంగిమ లుల్లసిల్లగా
దరిసెన మిచ్చి భక్తసముదాయ వరప్రదులై వెలుంగుచుం
దురు, తమ సృష్టికర్తకతిదుర్భరపుం బ్రతుకుల్ ఘటించుచున్.

శిల్పి చక్రవర్తి శిల్పి సమ్రాట్టను
బిరుదు లెన్నో వాని యఱుతగలవు
ఱాలు రప్పలతని ప్రబల సామ్రాజ్యంబు
చింకి చాప వాని సింహపీఠి.

పసుపుం గుంకుమ పూజలందుకొని యప్పాషాణదైవంబులా
కసపుం బుష్ప వికుంఠ పుణ్యములు భక్తశ్రేణికర్పించి సం
తసమున్ గూర్చుట కన్నులారగని యేతచ్ఛిల్పి చిత్తంబునన్
వ్యసనం బంతయు విస్మరించె కృషి ధన్యంబయ్యెనం చెంచుచున్.

జరిగెన్నాలుగునాళు లొక్కెడ ప్రతిష్ఠల్ రాఘవస్వామి కు
ర్వర నీళ్ళాడినయట్లు తైర్థిక సహస్రంబుల్ సమావేశమై
హరి సందర్శన మాచరించె మరునా డజ్ఞాతుడూరేగు పె
న్నరథంబున్ గదలించి రర్చకులు తూర్యధ్వానపూర్వంబుగన్.

రక్కసి చక్రముల్ కదలి రథ్యలు బెత్తెడుగ్రుంగి దుమ్ము మి
న్నెక్కగ స్వామివా రరదమెక్కి ప్రజల్ జయవెట్ట కానుకల్
మ్రొక్కులు గొంచు నూరి నలుమూలల గ్రుమ్మరువేళ నెవ్వడో
యొక్క బికారి చచ్చిపడియుండె దదుద్ఘట చక్రఘట్టనన్.

ఊడిచి పారవైచి రొకరిద్దరు స్వామిరదాని కడ్డ ము
న్నాడని పుణ్యమూర్తి తిరుణాళ్ళ మహోత్సవవేళ జచ్చి యు
న్నాడని పాపమెవ్వడొ యనాథుడు లేచినవేళ యెట్టిదో
నేడని కర్మలెమ్మని రనేకు లనేక విచిత్రరీతులన్.

ఆతని రక్తమాంసముల నాహుతిగొన్న రథంబుగాని వి
ఖ్యాతుడు రాఘవప్రభుడుగాని తదర్చకకోటిగాని యా
ప్రేతము శిల్పిదం చెఱిగి వెచ్చని బాష్పకణంబు రాల్ప లే
దీ తరహా కృతఘ్నత సహించెదవా ? జగదేక నాయకా !

ఊరికి నుత్తరాన బడియున్నది శిల్పి శరీర మున్వికిన్
భారముగాగ రావులుగు పంక్తులమధ్య తదుజ్జ్వల త్కళా
భారతి తత్కళేబరముపజ్జ రసజ్ఞుల హెచ్చరించుచున్
బోరున నేడ్చుచున్నయది పుట్టెడు దుఃఖముతో ననాథయై.

ముసలిము దంపతు లిద్దరు
వసియించుచునుండి రొక్క పల్లియలోనన్
సిసలైన నీతిమంతులు
పసిపిల్లలవంటివారు పరమ దరిద్రుల్.

ఉరుదురాదు వారి కూర రెండప మన
ల్మానుగీము వేరలేని కతన
యెఱుగ దాకుటుంబ మెట్టి దోషంబు న
ల్లానుగాని తమ ఖొరానుగాని.

మృగయా జీవన మా యా
ల్మగలకు నాధార, మయ్యమాయికుల పయిన్
బగలుం గషులు లేవట
పగలుం బార్టీలు గల్గు పల్లీయులకున్.

పండిన గడ్డాల పసమిట్టి పడువారు
నిగ్గైన షేరువాణీలవారు
కరపచ్చి పసరు పాగాలు దాల్చినవారు
మేలైన మొగలిటోపీలవారు

ఐదువేళళ నమాజాచరించెడివారు
జాళవా పెళ్ళబెత్తాలవారు
పలుచ చల్లాడాలు మొలనుదాల్చినవారు
సతతము కల్మాలుజదువువారు

కరమున ఖొరాను వేదాలుగలుగువారు
కుచ్చుల చడావు లంగ్రముల గులుకువారు
కనుగొలంకుల సురమాలు గలుగువారు
అందముగలారు దీర్ఘ దేహములవారు .

ఇసలాం వీరమత ప్రచారమునకై యేతెంచి రా యూరికిన్
ముసిలిం భక్తులు ముప్వు రా తురకయుస్ బూబున్మహాభక్తి మా
నసులై కొల్చి మృగామిష ప్రముఖ నానారుచ్యభోజ్యాదులన్
వెస సంతుష్టులజేసి పొందిరి తదుద్వేలాశిషప్రాప్తులన్.

మరునాటి వంటకై రా
తిరిశేషము నేదుతల వధించుట గని య
గ్గురువులు క్రోధోదురులై
మురదా రని కేకలెట్టి మూర్ఛితులగుటన్

కనుగొని గుండియ లాగం
తినరాదా స్వామి యంచు దెరచిన నోరన్
ధరణి కొరగి మరణించెన్
దురక, యమాయికుడు దిక్కుతోచనివాడై.

8)

గుసువులు మూర్ఛదేరుకొని, గొల్లున నేడుచు బూబు నక్క శే
బరమును జూచి గుండెలు గుబాలన నోటన మాటరాక ని
వ్వెరపడి యూరిపెద్దలను బిల్చి యదార్థము విన్నవించి న
ల్వురి సలహాలపై యతని పూడిచిపైచిరి వల్లకాటిలో.

ఆ దీన యనన మానిని
నోదారిచి సాగిపోయి రూరు విడిచి య
ప్పేదల దుర్గతి హృదయము
ఛేదింపం గురుల్ ఖిన్న చిత్రితముఖులై.

వారు ఖొరానును యువన శ
రీరముతో బూడ్చి విస్మరించు టెఱిగి కం
గారెత్తి వచ్చి చూచిరి
గోరీ పెకలించి యినుప గునపమ్ములతో.

లేదు ఖొరాను గ్రంథ మట, లేదు దరిద్రుని దేహమందు నా
చ్ఛాదన జేసినట్టి చిటిచాపయు కట్టిన ప్రాత్తళ్ళజాడయున్
లే దతి విస్మయంబున పలీలు శిలాప్రతిమానులై మహో
న్మాదుల రీతి నిలిచిరి సమాధికడన్ మదులల్లలాడగన్.

అల్లా భక్తుడు గాసిత
డల్లాయే భక్తుడితని, కభము శుభంబున్
కల్లాకపటం బెఱుగని
వల్లీ యగు నంచు గగనవాణి వచించెన్.

చలన చిత్రమునకు జని యొక్క నడి రేయి
సదనమునకు జేర జనుచు నుంటి
చెరువు గట్టుమీద శిశురోదనం బొండు
శూలమగుచు చెవుల శోకెనంత

బలిసిన కాఱుచీకటిని బర్విడుచున్నది స్త్రీస్వరూప మ
క్కలియుగ కర్ణునిం జెరువుగట్టునకుం బలి జేసి వేశ్యగా
తలచితిగాని కాదు, కడు దారుణదానవ దుష్టసంఘపుం
బురి తిసివేయుచున్న యొకి పూర్వసువాసిని నిస్సహాయమున్.

కాన ప్రాణంబుననున్న బాలుని యాక్రోశంబు నాలించి వె
చ్చని కన్నీరు వెలార్చితిన్ సరసు వెచ్చంబారె, మండూకముల్
పనవెన్ జిత్రవిచిత్ర నాదములతో బంగారుపాపండు సా
చిన సర్వేశుని హస్తపద్మముల మూసెన్ జిట్టి నేత్రంబులన్.

అగ్గ్రమైన పుత్రవిరహానలకీల హృదంతరాళమున్
బుగ్గి యొనర్చుచుండ వలపులం దనుజన్ముల కింపుమీరగా
నుగ్గులుబెట్టు గేహినుల కూడిగమూనుచు లోన కోరికన్
బ్రుగ్గినశింప నప్పతిత మానిని యెందు తపించుచున్నదో.

ఆ పసిబిడ్డ దుర్మృతికి నాతనిజన్మకు హేతువై మహా
పాపముగట్టుకొన్న మగవాడు సమాజమునందు డాగి సం
తాపముజూప కా నిసుగు తల్లిపయిన్ కలనేరమంతయున్
మోపి చనెన్ నిజాత్మజుని మూపునదాల్చి వినీతిశాలిగా.

బాలుని దేహమున్ నికట వైద్యకశాలయమందు ఖండఖం
డాలుగజేసి తద్గురుజనం బుపదేశము చేయుచుండె శి
ష్యాళికి దేహశాస్త్ర విషయంబులు ప్రేక్షక రోగి వర్గముల్
జాలివహింప గుండియలు జల్లన కన్నులు చెమ్మగిల్లగన్.

కెవ్వున కేకవేసి యొరిగెం ధర కందొక జోగురాలు లే
జవ్వని మూర్ఛవోయె పరిచర్యలు చేసిరి మంత్రసాను లా
బువ్వకు బట్టకు న్నవసి పొక్కెడు నెక్కలికిన్ దదంబగా
నవ్వడిబట్టి నిర్ణయము నల్పిరి హంతకిగా భిషజ్కృణుల్.

ఆరా తీసిరి రక్షకప్రముఖు లందం దక్షి సాక్ష్యాలతో
నేరంబు దలమోపి రప్పడితియున్ నిక్కంబు వాక్రుచ్చె క
న్నీరోడ్చెన్ దెరచాటునన్ పసలు నన్నీచున్ మనుష్యాధమున్
సైరించెన్ కరుణాక్షమాగుణ నివాసంబుల్ సతీచిత్తముల్.

ఉరికంబ మెక్కి చూచెం
దరుణి యసత్కారుని సంఘదైవతము సదా
మరియాదజేయు పూజా
పరునిం దూరమున శిరమువాల్చి గతించెన్.

నగ్నసత్యలక్ష్మి నాలుకలేనిదై
మూర్ఛవోయె రుద్రభూమియందు
ఉర్విజములు రాల్చుచుండె నీహార బా
ష్పములు లలితపల్లవములనుండి.

భూత పంచకంబు పొట్టలు పెకలించి
సృష్టిశక్తులెల్ల సేకరించి
గర్వితాత్ముఁడగుచు గావించె బ్రహ్మాస్త్ర
శస్త్రచయము నొక్క శాస్త్రవేది.

ఒక్కొక యస్త్రగోళము ప్రయోగముచేయ సమాయిక ప్రజల్
ముక్కలు ముక్కలై కరిగిపోయిరి బూడిదరాసులైన య
ప్పక్కణకుడ్యముల్ శిథిలపంక్తులు ప్రేక్షణ భీషణంబుగా
నిక్కి శపింపసాగినవి నేటికి మానవ దుష్టశక్తులన్.

ఆ మేథానిధి ఆత్మదేశజుల మర్యాదల్ సమార్జించి సం
గ్రామోత్సాహమురేగ నూతన విషాస్త్రంబుల్ వినిర్మింపగా
భూమీశుల్ పురికొల్ప యంత్రనిలయంబున్ జొచ్చి వీక్షించె నే
త్రామోదంబుగ మేరినందనుని ఛాయాచిత్రముల్ భిత్తికన్.

పెదవి గదలించి కన్నుల తుదలయందు
అశ్రువులురాల గుండియందర ప్రావృ
టబ్ద గంభీరఘోష ఛాయాపటంబు
నందుగల క్రీస్తుబొమ్మ యిట్లనియె నంత:

"ప్రకృతి జ్ఞానము నీకొసంగినది యీ పాపక్రియార్థంబుగా
దిక చాలింపుము నీకృపారహిత దుష్కృత్య ప్రయత్నంబు ప్రే
మకు పాదుల్ నెలకొల్పి రక్తరుచిరాంభస్సుల్ ప్రవర్షించి ముం
డ్ల కిరీటంబు ధరించితిం బటు కృతఘ్నా ! మృత్యుభృత్యాధమా!

రేణువులలోన నీవొక
రేణువవను మాట మరచి సృష్టించెదవా
ప్రాణాంతకముల నాగ్నిక
బాణా లధికారకాంక్ష పరమద్రోహీ!

తల పంకింతువు గాంధి బోధలకు సిద్ధార్థప్రభుం జూచి యం
జలిగావింతువు రంగుబేదమని యూర్ష్యన్ దీన నీగ్రోప్రజన్
వెలిగావింతువు నీ స్వభావమును నిర్భేధించు నణ్వస్త్రముల్
వలయున్ వాని తయారుజేసికొను మల్పజ్ఞాన చూడామణీ!

గౌతమబుద్ధు నస్థికలు గాంధిమహాత్ముని మేనిబుగ్గి నీ
పాతకముల్ హరింపవు ప్రపంచము గ్రుడ్డిది నీతిలేని నీ
జోతల మర్మమున్ గపటసూక్తు లెఱుంగదు విశ్వమానవ
భ్రాతృత నభ్యసింపుము స్వరాజ్య సుఖంబులు చూరలాడుమీ."

చిత్రముగ బలుకు యేసుని
చిత్రంబును జూచి వాడు సిగ్గిలి విచల
ద్గాత్రుడయి తాను జీవ
చ్ఛిత్రంబై నిలిచె ముగ్ధ చిత్తుండగుచున్

మెరుపుందీపిక లారిపోయినవి క్రమ్మెన్ జీకటుల్ మందిరాం
తరమందుం గల యంత్రసాధన పదార్థంబుల్ పిశాచంబులై
వెరపించెన్ వికటాట్టహాసముల దద్విజ్ఞాని సుజ్ఞానియై
చిరకాలంబు స్వకీయ శక్తులు వ్యయించెన్ లోకసౌఖ్యార్థమై.



# కవి జీవిత పరిచయం

జాషువ గుఱ్ఱం వీరయ్య-లింగమాంబలకు 1895, సెప్టెంబరు 28 న వినుకొండలో జన్మించారు. అస్పృశ్యత, దారిద్ర్యం వెంట తరుముతున్నా, సాహితీక్షేత్రమందు కృషీవలుడు కావలెనన్న కాంక్షతో ఆనాటి అనుకూల వాతావరణాన్ని, సానుభూతి కేర్పడిన దుర్భిక్షాన్ని ఎదుర్కొంటూ ముందుకు సాగారు. "కృషితోనాస్తి దుర్భిక్షం" నానుడి యదార్థమైంది. అనావృష్టులు, గాలివానలు గతస్మృతులైనాయి కవితా సుక్షేత్రంలో పసిడినే పండించారు.

ప్రాథమికోపాధ్యాయునిగా జీవితం ప్రారంభించి, నాటి మూకీ చిత్రాలకు వ్యాఖ్యాతగా ఊరూర తిరిగి, వీరేశలింగం, చిలకమర్తుల ఆశీర్వాదాలు పొంది కావ్యజగత్తులో స్థిరపడ్డారు. తిరుపతి వెంకట కవుల ప్రోత్సాహం ముందుకు నడిపింది.

ఉభయభాషా ప్రవీణులై తెలుగు పండితునిగా, ద్వితీయ ప్రపంచ సంగ్రామసమయంలో యుద్ధప్రచారకునిగా, స్వాతంత్ర్యానంతరం 1956 నుంచి 1960 వరకూ ఆకాశవాణి మద్రాసు కేంద్రంలో తెలుగు ప్రొడ్యూసరుగా ఉద్యోగాలు నిర్వహించారు.

కవితాభిమానులు, సాహితీసంస్థలచే వేయికిపైగా సన్మానాలు పొందారు. కవి కోకిల. కవితా విశారద, కవిదిగ్గజ, మధుర శ్రీనాథ, నవయుగ కవి చక్రవర్తి, విశ్వకవి సామ్రాట్ అను బిరుదములు

పొందారు. గండపెండేరము ధరించి, కనకాభిషేకాలు పొంది గజా రోహణము చేసి, పగటి దివిటీల పల్లకిలో నూరేగారు గుంటూరు పట్టణం స్వేచ్ఛా పౌరసత్వ మిచ్చి గౌరవించింది కేంద్ర సాహిత్య అకాడమీ "క్రీస్తు చరిత్ర" కావ్యమునకు అవార్డు బహుకరించింది. ఆంధ్రప్రదేశ ప్రభుత్వం శాసనమండలి సభ్యునిగా నియమించింది. ఆంధ్ర విశ్వవిద్యాలయం 'కళాప్రపూర్ణ' బిరుదాంకితుని చేసింది. రాష్ట్రపతి "పద్మభూషణ" బిరుదమిచ్చి సత్కరించారు

ముప్పదికి పైగా రచనలుచేసి 1971 జూలై 24 న కీర్తిశేషులైనారు